Regd No. N. 45 M 3813

వెల ఒక అణా

1-2-10

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ జ్యేష్ఠ బ॥ ౧ (౧౫-౬-౧౩౪౯ ఫ.) గురువారము సంచిక ౧౪

హిట్లరు యొక్క ఆశయాలు

అమెరికాకు బ్రిటను ప్రతినిధి బెదరింపు

# బ్రిటను ఒంటరిగా చిక్కినది

## ఫ్రాన్సు మంత్రివర్గము మారుట

### యుద్ధవిరామానికై క్రొత్త ప్రధానియత్నము

ఈ జూనునెల ౧౬ వ తేదినుండి ౧౭ వ తేదివరకు వచ్చిన వార్తలలో ఫ్రాన్సు తాత్కాలికముగ జర్మనీతో సంధికుదుర్చుకొని యుద్ధమువిరమించుటకు ప్రయత్నముచేయుచున్నట్లు సూచించు అంశములు ప్రధానములై యున్నవి. యుద్ధముకూడ ఒకమూలజరుగుచున్నది. కాని అంతవిజృంభణముగా నున్నట్లువార్తలు తెల్పుటలేదు. జరుగుచున్న చోట్లలో జర్మనుసేనలు ఒక ప్రదేశమువెంట మరియొక ప్రదేశమునాక్రమించుచుముందుకుపోవుచున్నవి.

జూను ౧౫ వ తేదివాటికి ఫ్రాన్సులోని టూర్సువద్ద మకాంచేసియున్న ఫ్రెంచిప్రభుత్వము అక్కడినుండికూడ బోర్డోయోకు పోయెను. జర్మనులు తూర్పుఫ్రాన్సులో రోమిలీప్రదేశములో సీనునదినిదాటిరి. ట్రాయిస్ మొదలుకొని సెయింటు డిజియర్ వరకును జర్మనుసేనల ఒత్తిడియుండెను. పారుంటు వైపుకూడ వడమునుండిరి. అర్వేన్సుప్రాంతములో ప్యారిసుకు ప్రాంతముపైకి జర్మనులు దండెత్తిరి. కొన్ని సేనలు రైనునదిదాటెను. ఇక పశ్చిమఫ్రాన్సులో లూవియరువద్దను ఎవరూవద్దను పోరాటము జరుగుచుండెను. చాంపేను ప్రాంతములో జర్మనుసేనల ఒత్తిడి ఎక్కువగా నుండెను. జర్మనుసేనలు మ్యూజునదికిరువైపులనుండిన దుర్గశ్రేణిని భేదించుకొనిపోయి వర్డనును వశముచేసికొనెను.

ఇటు జర్మనుల అక్రమణతో తులతూగుటకు ఫ్రెంచిబలములు చేసినదేమి? జూను ౧౪ వ తేది రాత్రి జర్మనీపైకి బ్రిటిషువిమానములుపోయి మాను హైమను, రైన్లాండుపైనను బాంబులను వేసెను. రెండు బ్రిటీషువిమానాలజాడ తెలియలేదు. బెల్జియము రేవులలో జర్మనుల మందుగుండుసామగ్రి చాలఉండగా దానిపై బ్రిటిషువిమానములు గుత్తిపెట్టి బాంబులువేసెను.

౨౦ లక్షల జర్మనుసేన

మొత్తముమీద ఈ ౧౫ వ తేదినాటికి జర్మనుసేన ఫ్రాన్సు పశ్చిమ సముద్రతీరమునుండి మ్యూజునదివరకు ౨౦ లక్షలమందితో విస్తరించియుండెను ఇంకను క్రొత్త సేనలువచ్చుచుండెను. తూర్పువైపునకూడ పరిస్థితి మహప్రమాదకరముగ నే యుండెను. ఫ్రెంచిసేనలు అపారకష్టనష్టముల పాల్పడుచు అలసిపోవుచుండెను. అమెరికానుండి వెంటనే కొలది ఎక్కువగా విమానములు ఫ్రాన్సుసహాయమునకై రానిచో ఘోరవిషాదమే సంభవించునని తలచబడుచు, ఇక ఇరువది నాలుగుగంటలలోనో, ౪౮ గంటలలోనో ఫ్రాన్సులో యుద్ధపర్యవసానము తేలగలదను మాటలు వినపడసాగెను.

జూను ౧౬ వ తేదినాటికి జర్మనుసేనలు ఫ్రాన్సు పశ్చిమభాగములో ఎవెర్నెస్ కు చాత్రీసుకుమధ్యనుండెను. షాంపేనువద్ద జర్మనులు ఫ్రెంచిసేనలను భేదించి ముందునపోయిరి. చాంటూలియరీవద్దను, మాంటెనుడిసీమ్ను వద్దనుకూడ ఫ్రెంచిసేనలు భేదింపబడెను. సీనునదికైపున్ను, లొరెనదివైపున్ను అవి విస్తరించి, సెన్సువరకున్ను ట్రాయిసువరకున్ను పోగలిగెను. పారుంటువద్ద జర్మనుసేనలు పోర్టస్టీ అటి మగువరకున్ను, వర్దనుకు తూర్పుగానున్న ప్రదేశపు ఉత్తరపుకొసవరకును వ్యాపించెను. కొందరు జర్మను సైనికులు పారుంటుముదాటి గ్రే ప్రాంతమువరకు పోగలిగిరి. ప్యారిసునగరమునకు పడమట లాయిల్ప్రాంతములోను, లాఫోర్టిపిడేమువద్దను జర్మనుదండెత్తిరి. ౧౪వ తేది న్యూబిసాకువద్ద జర్మనుల క్రొత్తదండయాత్ర సీనునదిదాటకుండ నిరోధింపబడెను. జర్మనుసేనలు ఎట్లో సీనునదిపై కొన్నిచోట్ల తెపలను దాటగలిగెను. ప్యారిసుకు ఆగ్నేయదిశన సీనునదిని జర్మనులు మెలూనువద్దను, ఫోన్ టెన్బ్లో వద్దనుదాటి, క్లెమ్సీవైపునకును, ఆవలాను వైపునకును, అక్జెర్ వైపునకునుపోగలిగిరి. లాంగ్రెను పీఠభూమికి దక్షిణముగా డిజియరుకు ఉత్తరప్రాంతమునకును గ్రే ఎగువగానున్న పావోసుఖరకును జర్మనుసేనలుచేరెను. జూను ౧౬ వ తేది సాయంకాలానికి జర్మనుసేనలుమాజినాటు దుర్గశ్రేణి నలువైపుల అవరించుటకై నమముండెను. మాజినాటు దుర్గములనుండి ఫ్రెంచిసేన తీసివేయబడుచుండెను. ఫ్రెంచిసేనలు సాధించినదెక్కడలో జర్మనుసేనలపైనను, సేనలకైపోవుసరకుల లారీలపైనను ఫ్రెంచివిమానములు బాంబులువేయుచుండెను: అయిను జర్మనువిమానాలను క్రిందికికూల్చెను.

జూను ౧౭ వ తేదినాడు లయాన్గోలోను, చాటోడిజాంలోను, సౌటీక్ ఆవలాన్ లోను జర్మనుసేనలకును ఫ్రెంచిసేనలకును పోరాటములు జరుగుచుండెను. జర్మనులు సావూనదిని అక్కడక్కడ దాటిరి.

అమెరికా సమాధానము

ఇంతకంటెమించి ఫ్రెంచి జర్మనియుద్ధవార్తలేవియు లేవు. ఫ్రెంచిసేనలకు సహాయముకోరుచు ఫ్రెంచిప్రధాని రేనాడుగారు అమెరికా అధ్యక్షుడగు రూజ్వెల్టుగారికి ఒక సందేశమంపియుండిరిగదా. దానికి రూజ్వెల్టుగారు సమాధానమిచ్చుచు, గడచిన కొలదివారాలలో మిత్రమండలికి విమానములను, ఫిరంగులను, ఆయుధసామగ్రులను, మందుసామగ్రిని అమెరికా పంపెననియు, ఇపుడు ఇంతకంటె రెండింతలవరకును తయారుచేయుటకు అమెరికా పూనుకొనగలదనియు, ఒక్కొక్కసారము గడచినకొలదియు, మరింత ఆయుధసామగ్రిని మిత్రమండలికి అమెరికా పంపుచుండగలదనియు, ఫ్రాన్సును జర్మనులు అక్రమించినను, అది అక్రమాక్రమణమగుటచే అమెరికా ఫ్రాన్సుదేశము అపుడు జర్మనీవారిదని అంగీకరించదనియు, సైన్యసహాయవిషయములో అమెరికా పార్లమెంటుకప్పు తానేమియు వాగ్దానముచేయుఅధికారము కలవాడను కాననియు తెలియబరచిరి. ఈ సమాధానమును జూను ౧౫ వ తేది పెలిగ్రాంగా ఫ్రాన్సుకు పంపినతర్వాత రూజ్వెల్టుగారు ఆరోజు అమెరికాలోనుండు బ్రిటిషు, ఫ్రెంచి రాయబారులతో సంభాషించిరి.

ఆనాడే సాయంకాలము ౭ గంటలవేళ మిత్రమండలివారి సంయుక్త యుద్ధాలోచన సంఘసమావేశము బోర్డో నగరములో సమావేశమై అనంతరకర్తవ్యమునుగూర్చి ఆలోచించెను. ఇదే రోజు రష్యాలోనున్న బ్రిటను రాయబారియు, ఫ్రాన్సురాయబారియు రష్యా విదేశాంగ మంత్రియగు మాలటోవ్ గారిని దర్శించి మాట్లాడిరి.

జూను౧౬వతేది సాయంకాలము ఫ్రెంచి మంత్రివర్గము ఫ్రెంచి రిపబ్లిక్కు అధ్యక్షుడగు లీబ్రన్ గారి అధ్యక్షతన ఉదయము ౧౧గం.౧౫ ని.లకు సమావేశములో అమెరికా చేసెడమనుచున్న సహాయముతో, ప్రస్తుతము ఫ్రాన్సు సేనలున్న స్థితిలో జర్మనీతో యుద్ధమును సాగించుటకు ఇంకనవీలున్నదాలేదా అను విషయము ఆలోచించబడెను. ఫ్రెంచి మంత్రివర్గము పగలేగాక సాయంకాలముకూడ సమావేశమై ఆలోచించెను. రాత్రి౧౧గం.లవరకుకూడ చర్చ జరిగెను. ఈ సమావేశములో తుదకు రీనాడుగారు ప్రస్తుతము దేశములో అన్ని పక్షములవారి గౌరవమునకు పాత్రుడైనవ్యక్తి ప్రభుత్వము నేర్పరచుట యుక్తమనితలచి తమమంత్రివర్గము రాజీనామాను అధ్యక్షునకు లీబ్రన్ గారికిచ్చిరి. లీబ్రన్ గారు రేనాగారిదేశభక్తిని మెచ్చుకొనుచు ఆ రాజీనామా నంగీకరించి, మార్షల్ పెటెయిన్ గారిని నూతన మంత్రివర్గ మేర్పాటు చేయకోరిరి. పెటెయిన్ గారు ౧౦ంకును అంగీకరించి వెంటనే మంత్రులను నిర్ణయించిరి.

క్రొత్త మంత్రివర్గము

మా ర్షల్ పెటెయిన్ అధ్యక్షుడు (అనగా ప్రధాని) మార్షల్ పెటెయిన్ గారు. ఉపాధ్యక్షుడును స్టేటుమినిస్టరున్ను కెమిలీ షాటెమ్ప్సగారు. దేశరక్షణాధిమంత్రి జనరల్ వేగాండుగారు. న్యాయశాఖమంత్రి ఫ్రెమికోర్టు. యుద్ధమంత్రికూల్సన్. నౌకలమంత్రి డార్లన్. విమానమంత్రి జనరల్ ప్యూగాట్. విదేశాంగమంత్రి పాల్ బౌడౌవిన్. దేశాంగమంత్రి పామరెట్. ఆర్థిక, వాణిజ్యశాఖ మంత్రి బౌథిలియర్. కాలనీలమంత్రి రివియరీ. విద్యాశాఖమంత్రి రిగాడు. నిర్మాణశాఖ మంత్రి చిచెరి. కార్మికశాఖమంత్రి ఫెవార్. ప్రభుత్వోద్యోగము చేసినవారలకొఱకు మంత్రి బార్ను గారే.

ఈ క్రొత్తమంత్రివర్గ మేర్పడినవెంటనే అది ఫ్రెంచిరిపబ్లిక్కు అధ్యక్షుడగు లీబ్రన్ గారి అధ్యక్షతన సమావేశమై ఫ్రెంచిసేనల బలమును గూర్చియు విదేశములతో ఫ్రాన్సు పలుకుబడికి గల బలములనుగూర్చియు ఆలోచించెను.

బ్రిటిషు ప్రభుత్వము ఆశ

ఫ్రెంచివారికి యుద్ధములో సహాయముచేయుటకై బ్రిటిషుప్రభుత్వము ఫ్రెంచిప్రభుత్వముతో ఒకఒడంబడిక చేసికొన నిశ్చయించుచున్నట్లు-బ్రిటిషుప్రభుత్వము ఫ్రెంచిప్రభుత్వమునకు ఒక సందేశమును ఫ్రాన్సులోని బ్రిటిషు రాయబారిద్వారా అందజేసెను. ఆసందేశంలో ఇరుదేశాల ప్రభుత్వములున్ను, తమ దేశాలు వేర్వేరుగాక ఒకదేశమేనని ప్రకటనచేయవలెనని సూచించబడెను. కాని అనూచన ఫ్రెంచిప్రభుత్వమునకు చేరునప్పటికి క్రొత్త ఫ్రెంచిప్రధాని యుద్ధము విరమించవలెనని నిర్ణయముచేసి, ఏషరతులపై జర్మనీ యుద్ధ విరామానికి అంగీకరించునో తెలుపవలసినదిగ జర్మనీసైనికాధికారులకు లేఖ పంపించెను. ఈసంధిప్రయత్నాలలో ఫ్రాన్సులోని స్పెయినురాయబారి మధ్యవర్తిగా పనిచేయుచున్నాడట. పశ్చాని మార్షల్—

పెటెయిన్ గారు తమదేశీయులకు జూను౧౭ వతేదిరాత్రి బ్రాడ్ కాస్టుద్వారా విన్నవించుచు, ఫ్రాన్సుయొక్కదురదృష్టమును తగ్గించుటకై తాను ఫ్రాన్సు ప్రభుత్వాధికారమును చేపట్టినట్లు తెలిపి "భగ్నహృదయుడనై యుద్ధము విరమించవలెనని నేను మీకు చెప్పవలసి వచ్చినది. గౌరవముగా పోరాడినతర్వాత, పోరాటమును విరమించుటకై సైనికులు మార్గమును ఆలోచించుచున్నట్లు శత్రువు యుద్ధ విరామోపాయమును సూచించుటకు సిద్ధమాఅని నేను గతరాత్రి (అనగా జూను౧౬) శత్రువును అడిగితిని. ఈకష్టకాలములో ఫ్రెంచిప్రజలందరును నేను అధ్యక్షతవహించియున్న ప్రభుత్వమునకు తోడుగా నుండుదురుగాక!" అని చెప్పిరి.

గౌరవయుతమైన సంధియేకావలెను.

జూను౧౭వతేదిరాత్రి క్రొత్త ఫ్రెంచివిదేశాంగమంత్రి బాడోయిన్ గారు బోర్డోనుండియే బ్రాడ్ కాస్టుచేయుచు ఇట్లు చెప్పిరి: "గౌరవయుతమైనసంధి లభించుచో మాఆయుధములకు విశ్రాంతినిచ్చెదము. కానిమాప్రజల ఆధ్యాత్మిక స్వాతంత్ర్యమునకు వినాశకరముగ పరిణమించగల అవమానకరమైన షరతులను అంగీకరించుటకు మేమెన్నటికిని అంగీకరించజాలము" తర్వాత మంత్రిగారు జర్మనీయొక్క అపారసైనికబలముచే ఫ్రెంచిసేనయొక్క శీరము చెడలేదని చెప్పి బ్రిటను లనవిమానాలను నౌకలను, సైనికులను ఇచ్చి ఫ్రాన్సుకు తోడ్పడవలెనని కోరిరి.

హిట్లరువద్దకు ముసోలిని ప్రయాణము

ముసోలినిగారు కౌంటుసియానోగారితోను, ఇటలీలోని జర్మనురాయబారియగు హెర్ వాన్ మాకిన్సన్ గారితోను కలిసి హిట్లరు ప్రకటనను గూర్చి హిట్లరుతో చర్చించుటకై రోమునగరమునుండి జూను౧౭వతేదినాడు బయలుదేరిపోయెను. స్పెయిను నియంతయగు జనరల్ ఫ్రాంకో మార్షల్ పెటెయిన్ కు పరిచితుడగుటచే ఫ్రాంకో ఈసంధి ప్రయత్నాలలో మధ్యవర్తిగా పనిచేయుచున్నట్లు తెలియుచున్నది.

జూను౧౭వతేదినాడు రష్యాలో జర్మను రాయబారియగు హెర్ వాన్ షూలెన్బర్గుగారు రష్యావిదేశాంగ మంత్రియగు మాలటోవుగారితో సంభాషించిరి.

### శక్తిక్రమేణ క్షీణించుట

మలేరియా జ్వరపీడితులు నిర్బలులగుటచే ఏ అహారమును తినజాలరు.

జ్వరము మిమ్ములనెందుకు నిశ్శక్తులుగా చేయును? జ్వరోత్పాదిపము రక్తములోకలిసి, నరములయందులలో ప్రవేశించి, మీశరీర లావణ్యములను బలహీనముగా చేయునని డాక్టర్లు చెప్పుదురు.

కడుపు ఈ బాధను తప్పించుకొనజాలదు. జీర్ణశక్తి తగ్గుటచేత కడుపునొప్పిగ్రము. మలేరియా జ్వరపీడితులు నిశ్శక్తులగుటచే ఏఆహారమును తినజాలరు

అలసిన దేహమునకు ఆహారము అవసరము. హార్లిక్స్ తగినదైన అహారము. ఇది జీర్ణశక్తికి ఏంటివాసికలుగజేయుక, సులభముగా జీర్ణమై, అలసిన నరసొన్తయురుపులకు పటుత్వమునిచ్చి, దేహమునుపూర్తిగా నియ్యాలించును.

"పెంగలి జనార్ధనరెడ్డి వేతనములు"

ఇందుమూలమున తెలుపునదేమన పింగలిజనార్ధనరెడ్డి వేతనములు కోరెడి విద్యార్థులు తమదరఖాస్తులను ౨౫ వ జూను ౧౯౪౦. లోగ క్రిందిచిరునామకు పంపుకొనవలయును- ఇదివరకు వేతనములు పొందుచుండిన విద్యార్థులు తమతమ పరీక్షాఫలితములను తెలుపవలయును- నూతనవిద్యార్థులు తమదరఖాస్తులవెంట దిగువవివరించిన సనదులను పంపవలయును.

౧. ముల్కీసనదు-
౨- ఆరోగ్యస్థితిసనదు-
౩- మంచినడతనుగురించిన సనదు-
౪- తాను బీదవాడని బుజావుచేయు సనదు-
౫- ఏపరీక్షలో కృతార్థుడైనది మరియు ముందు ఏమి చదువనున్న విషయము-

వేతనములు- ఇంజనీయరింగు, డాక్టరి మొదలయిన సాంకేతికవిద్యలకు మాత్రమే ఇవ్వబడును.

పి- వి- నృసింహారెడ్డి,
నెం- ౩౧౩౦, రామమందిరము,
గౌలిగూడెము (హై॥)

జాతీయ గ్రంధములు

| | |
|---|---|
| హైందవ ధర్మవీరులు | ౦-౬-౦ |
| సాంఘిక స్వాతంత్ర్యములు | ౦-౫-౦ |
| కమాల్ పాషా జీవితము | ౦-౧౨-౦ |
| (రెండు భాగములు) | |
| ప్రజలు—ప్రభుత్వము | ౦-౬-౦ |
| బౌద్ధ సంస్థానము | ౦-౫-౦ |
| కాంగ్రెసు-సంస్థానములు | ౦-౬-౦ |
| సంస్థానసమస్యలు | ౦-౬-౦ |

సభ్యులకు ప్రత్యేకవెల

వార్షికమూల్యము రు ౧-౮-౦లు

దేశోద్ధారక గ్రంధమాల
సికింద్రాబాదు.

## దేశరక్షణకై క్రొత్తనిబంధన

ఇండియా ప్రభుత్వమువారి చర్య

సిమ్లా, జూన్ ౧౮

రహస్యవార్తలను ప్రచురించువారు శత్రువులకు తోడ్పడునట్లుగాని మరేవిధముగానైనను దేశానర్థకమైనట్లుగాని వార్తలను ప్రచురించినచో తమకా వార్తలెవ్వరు పంపిరో తెలుపవలెనని నిర్బంధము విధించుటకు ఇండియా ప్రభుత్వమువారు ఒకక్రొత్త నిబంధనను గావించియున్నారు భారతదేశరక్షణ నియమావళిని సవరించుచు ఈక్రొత్త అధికారమును ప్రభుత్వమువారు గైకొనుచున్నట్లు ప్రత్యేక గెజెట్టు తెలుపుచున్నది

## భారతదేశరక్షణ శాసనము క్రింద అరెస్టులు

జూను ౧౭వ తేది

ప్రతివాదభయంకర వెంకటాచారిగారిని దేశరక్షణ నియమములక్రింద సామర్లకోటలో అరెస్టుచేసి రాయవేల్లూరు సెంట్రలుజైలుకు తీసికొనిపోయిరి

నెల్లూరులో యిదేనియమావళిక్రింద అరెస్టుచేయబడిన క్రిష్ణారావు రావిఆదిశేషు, శంకరరెడ్డి, రంగయ్య వీరలు జూన్ ౧౭వ తేది వేలూరు సెంట్రలు జయిలుకు తీసికొనిపోయిరి

## క్రొత్తకాంగ్రెసు కార్యవర్గ సభ్యుడు

నయినటాలు జూన్ ౧౭

పూర్వము సంయుక్తరాష్ట్రములలో కాంగ్రెసు ప్రధానమంత్రిగా పనిచేసిన పండిత గోవిందవల్లభపంతుగారిని భారత కాంగ్రెసు కార్యసంఘంలో మిగిలిన ౧౫వ సభ్యునిగా మౌలానా అబుల్‌కలాం ఆజాదుగారు నియమించినారు

## ఖాక్సారులకు శత్రుసంబంధములేదట!

నవాబు బహదర్ యార్ జంగుగారి ప్రకటన

న॥ బహద్దరుయార్జంగు సరిహద్దురాష్ట్రము కాశ్మీరముయొక్క హాజీ మెహరాజ్ గారున్ను, హైదరాబాదుకోస్తాం హాజీ మెహరాజ్ గారున్ను ఖాజీ అబ్దుల్ గనీ గారును గులాం మహమ్మద్ గారును ప్రతికా ప్రకటనయిట్లు చేసినారు

"సర్ సికిందర్‌గారు ఇటీవల ఖాక్సారులకు శత్రువులతో సంబంధమున్నదని చేసినప్రకటనను మేముచూచి చాలాఆశ్చర్యపడినాము ఈయుద్యమము గా ఏండ్లనుండి జరుగుచున్నది ఇదికేవలము మతసాంఘికోద్యమను, పరస్పరైకమత్యమునకై పాటుపడుచున్నది ఇంతవరకు బయటివారితో దీనికిసంబంధమున్నదనుట మాకింతవరకు తెలియదు ఈగా ఏండ్ల అనుభవములో దీనికిబయట రాజ్యముతో సంబంధములేదనియు ఇంగ్లీషువారికీయుద్ధములో సహాయపడుటకు సిద్ధపడియుండిరనియు మేమెరుగుదుము అయినా మాకు సర్ సికిందర్ గారు తమకుతెలిసిన రహస్యములను తెలిపితేబాగుండును వారనుకొన్నట్లైతే మేముదాని సంబంధమును [illegible] ఖాక్సారులను పట్టుకొనుటకై పనిచేయుచున్న [illegible] సికిందర్ గారు తక్షణమే తమప్రకటనను ఉపసంహరించుకొనవలెనని కోరుచున్నాము

# జనాభా ప్రశ్నలు

## నిరుద్యోగ పరిమాణమును కనుగొనుయత్నము

క్రొత్తజనాభా లెక్కలు తయారుచేయునప్పుడు ఈక్రిందిప్రశ్నలకు ప్రత్యుత్తరము కోరబడును —

౧ పేరు

౨ స్త్రీయా పురుషుడా?

౩ తెగ, వర్ణము, జాతి

౪ మతము

౫ వివాహమైనదా? కాలేదా? విధవయా? లేక విడాకులచే వదిలించుకొనబడెనా?

౬ వయస్సు,

౭ వివాహితయైన స్త్రీకి పుట్టిన పిల్లల సంఖ్య

౮ ప్రథమసంతానం కలిగినప్పటికి ఆమె వయస్సు

౯ పూర్తిగాకాని కొంతవరకుగాని నీవు ఇతరులపై ఆధారపడి యున్నావా?

౧౦. ఆధారపడియున్నచో ఎవరిమీద ఆధారపడియున్నావో అతని జీవనాధారము ఎట్టిది?

౧౧ జీతమిచ్చి ఎవరినైన పనికి ఉంచుకొన్నావా?

౧౨ నీకు పనిఉన్నదా?

౧౩ పనిలేనిచో పనికొరకు వెదకుచున్నావా?

౧౪ ఇప్పుడు పనిఉన్నవో, పనికొరకు వెనుక ఎన్నాళ్లు దేవులాడితివి?

౧౫ నీకుగల జీవనాధారము ప్రధానమైనదా కాదా?

౧౬ కొంతవరకు ఇంకొకరిమీద ఆధారపడ యుందువేని, లేక అప్రధానమైన జీవనాధారము కలవాడవగుదువేని ఏడాదిపొడుగున నీకు పని ఉన్నదా? అట్లుకానిచో ఏడాదిలో ఏభాగములో పని ఉన్నది?

౧౭ ఎవరిక్రిందనైన పనిలోఉన్నచో నిన్ను పనిలోనుంచుకొన్న అతడు చేయుచున్న వ్యవహారమేమి?

౧౮ నీవు పుట్టినది ఈజిల్లాలోనా? లేక ఇంకో జిల్లాలోనా?

౧౯ నీ మాతృభాష

౨౦ నీవువాడు ఇతరదేశభాషలు

౨౧ చదువుట వ్రాయుట రెండువచ్చునా? అట్లయినచో నీవువ్రాయులిపిఏమి? లేక వ్రాయుటగాక చదువుటమాత్రమే వచ్చునా?

౨౨ ఎంతవరకుచదివినావు? నీవుప్యాసైనపరీక్ష ఏదైనచెప్పుము

౨౩ ఇంగ్లీషుభాష తెలియునా?

ఈప్రశ్నావళి యొక్క విశేషము

ప్రజల జీవనాధారములను, ప్రజలలో ప్రబలియున్న నిరుద్యోగమును తెలుపు లెక్కలు జనాభాలెక్కలలో ఇముడ్చుటకై ఎంతమంది కొంతవరకు ఇతరులమీద ఆధారపడియున్నారు, ఎంతమంది పూర్తిగా పనిలేకుండుచున్నారు ఏడాదిలో కొంతకాలము పనిలేకున్నారు, కుటుంబాధికారికి కుటుంబములో ఇతరులు పనిరూపంగా సేవచేయుచున్నారా, విద్యార్థులలో ఎందరు నిరుద్యోగులు మొదలగుప్రశ్నలకు జవాబులు తెలిసికొనవలెను. గతజనాభాలెక్కలు తీసికొన్నప్పటివలెగాక జీవనాధారము కనుగొనవలసినప్పుడు నికరముగుప్రశ్నలడిగెదరు ఉద్యోగమువ్రాతపని కాయకష్టముఅని,చెప్పిన సరిపోదు కాయకష్టమున్నచో పొలములోనా, లేక బొగ్గుగనిలోనా, జనుముఫ్యాక్టరీలోనా, ప్రత్తిబట్టల మిల్లులోనా లక్కఫ్యాక్టరీలోనా ఈమొదలగు వివరములు తెలుపవలసియుండును వ్యవసాయముజీవనాధారమగునో సొంతభూమియా? సొంతసేద్యమా, ఇంకొకరిభూమిని సేద్యముచేయుచున్నావా లేక వ్యవసాయకూలీవా అను ప్రశ్నలడిగెదరు ఇందువల్ల ఈవివరములన్నియు జనాభా లెక్కలలోనికెక్కును

పరిశ్రమలకు సంబంధించిన వివరములు తెలిసికొనుటకు వెనుకఅవలంబించినపద్ధతి చాలా క్లిష్టముగాను ఫలరహితముగాను ఉండెను అందుకని ఇప్పుడు ఈక్రింది సుస్పష్టమగుప్రశ్న అడుగదలచిరి "నీవుఎవరిక్రిందనైన పనిలో ఉన్నావా? నిన్ను పనిలోఉంచుకొన్నఅతడు చేయుచున్న వ్యవహారమేమి?

ప్రజల ఉత్పత్తిరేటు

ఎంతమందిపిల్లలుపుట్టిరి? ప్రథమసంతానముకలిగినప్పుడు స్త్రీకిఎన్నిఏళ్లుఅను ప్రశ్నకుచెప్పుసమాధానమువలన ప్రజలఉత్పత్తిరేటు, నిర్ణయించుటకు వీలుకలుగును జనసంఖ్య హెచ్చుచుండ ఉన్నట్టి, జనసంఖ్య తగ్గుచున్నట్టి దేశములకేగాక ఇండియావంటి దేశములకుగూడ ఈరేటు తెలిసికొనుట ముఖ్యమే వెనకటి నాపౌరగాక ఈసారి ఇందుకుసంబంధించిన ప్రశ్నలకు తప్పనిసరిగా జవాబులు తెలుపవలసియుండును భర్తగాని తండ్రిగాని స్త్రీతరఫున జవాబుచెప్పుటకు వీలుగానే ప్రశ్నలుండును స్త్రీలను అడ్డుప్రశ్నలడుగరు

ప్రశ్నలకుజవాబుకొరకు తెలివిగలవారైనచో సంతృప్తికరముగు సమాధానము పొందగలిగియుండును

—

కరోడిగిరినాజిం

హైదరాబాదు(దక్కన్)అమర్దాద్ ౧౧ ఈదక్కన్ చీఫాయి గారు కరోడిగిరి నాజిం కొరకు నియమింపబడినారు వారు క్రొత్తపదవిలో ప్రవేశించినారు

—

## మిలిటరీ డ్రైవర్లశిక్షణము

హైదరాబాదు(దక్కన్),అమర్దాద్ ౧౩ ఈక్రిందిరోడ్లమీద ౨౧జూలైనుండి మరల తెలుపువరకు మిలిటరీడ్రైవర్లకు శిక్షణ యియ్యబడును

౧ మెదకురోడ్డుపై ౮రవ మైలురాయినుండి,

౨ సికింద్రాబాదు మేడిచేల్‌రోడ్డున ౧౧వ మైలురాయినుండి,

౩ సికింద్రాబాదు షాహమీరుపేటరోడ్డున ౧౪ మైలునుండి

ఈప్రదేశములలో ఉత్తరదిక్కున్న భాగముల శిక్షణ ఇయ్యబడును ఈశిక్షణలో రాకపోకల్లు లేకుండా నడచును కావునప్రజలకు తెలుపనైనది—అని ప్రభుత్వము వారు తెలుపుచున్నారు

—

## పత్రశాఖా విషయాలు

హైదరాబాదు(దక్కన్), అమర్దాద్ ౧౫౩౯ ప్రభుత్వప్రకటనశాఖవారు ౧౫౩౯ పన్నాను నాడు మాట్లు తెలిపియున్నారు

ఒక ఎడాదికింద ట ఆధికారీతిగా గోకూడి క హిందూముల్మాన సమితి ఏ మతవిషయము ల సరిపద్యా రాగము ఏర్పాటైనది తెలపబడె అప్పుడు ఈ సంహారామండ్రము న్యక్షతిలో ప్ర ఆరెంగోను సమితిసమావే యుజరుగుతూ చ్చి నవి అందుచర్చించినవిషయములలో మతసంబంధ మగు నిర్మాణముల రిపేరీ ప్రజల అధ్యాత్మికో న్నతికొరకుండు ఆటంకములనివారణ బీదపిల్లల చదివించుట అనునవి ముస్లింప్రచారకులు, హిందూమహాంతులు తమతమ కేంద్రాలలో సంచారముచేసి ప్రజాభివృద్ధికి చాలాతోడ్పడినారు చాలాపాఠశాలలు స్థాపింపబడెను ప్రార్థనాలయాలు చాలావరకు రిపేరుచేయబడెను రాష్ట్రములోని నిజమైన పరిస్థితుల విషయమై ప్రచారముచేసి విరుద్ధప్రచారమువల్ల కలిగినఅపోహలు జనుల మనస్సులలోనుండి తొలగింపబడెను.

ముస్లింమతప్రచారకులు బీదపిల్లలకు పాఠశాలలుపెట్టుటకు ప్రయత్నించుచుండగా హిందూసమితివారు ఒక్క సంస్కృతపాఠశాలను స్థాపించుట కేర్పాటుచేయుచున్నారు

ముస్లింప్రచారకుల కమిటీలు ప్రతినెలకు తమ తమకేంద్రములలో ఒకసభచేసి ప్రతిచోటనుర—౫ మందికల ఒక ఉపసమితి నేర్పాటుచేసి పాఠశాలల విచారించుకొనుటకై నిర్ణయించినారు ప్రతిముస్లింప్రచారకుడును తమకేంద్రములోనివారితో కలిసి తమయాశయములను బోధించుటకై నిశ్చయించుకొన్నారు



## హరిభక్తమండలి

హైదరాబాదు(దక్కన్),అమర్దాద్ ౧౫౩౯ హైదరాబాదు చారుకమానులోని మార్వాడీలు యుద్ధములో బ్రిటిషుమండలికి జయముకలుగుటకై ౯దినాలు పూజలుగావించి పూర్తిచేసినారు ఈపూజలు ఏకధారగా దినమున్నూ ౨౪ గంటలు పూర్తిగా జరిగినవట మనుస్మృతిలో నిరూపించిన లక్షణక్రమముగా సాగినవట అన్నదానము అన్నిజాతిమతాలజనులకు చేసినారట

## డోర్నకల్లు హత్య

డోర్నకల్లు రైలుస్టేషనులో అబ్దుల్ రాఫ్ అను అరబ్బు ఒకనిని పొడిచియుండెనను హత్యాప్రయత్నాభియోగము సికింద్రాబాదులో విచారింపబడుచున్నది నిందితుని జమానతుపై విడుదలచేసినారు

## శాసనసభ ఎన్నికలు

హైదరాబాదు(దక్కన్) అమర్దాదు౧౫౩౯ ౧౩౫౦ ఫసలీలో గావింపబడిన శాసనసభానియమానుసారముజాగీర్దారులపక్షమున ఇద్దరుజాగీర్దారులను హైదరాబాదు శాసనసభకు ప్రతినిధులనుగా పంపవలెను కావున అట్టివారిఎన్నిక జరుగుటకునవాబు సాలార్జంగుగారి అధ్యక్షతలో ౨౬ జూలైనాడు ప్రొద్దున ౧౧గంటలకు సమావేశముజరుగును వోటిచ్చుటకు అర్హులైన జాగీర్దారులందరును పై నవాబుగారి దేవిడీకి వెళ్లవచ్చును

## బంగారు గనులు

హైదరాబాదు (దక్కన్) అమర్దాదు ౧౫౩౯ ౧౩౯అమర్దాదునాడు ప్రభుత్వప్రకటన శాఖవారిట్లు తెలుపుచున్నారు —

హైద్రాబాదు ప్రభుత్వమువారు రాష్ట్రములో బంగారుగనులను త్రవ్వించుటకు నిశ్చయించినారు రాయచూరుజిల్లాలో బంగారు గనులను పరిశోధించగా తృప్తికరమగుఫలితములు తేలినవి. ౧౯౩౬లో ౨౦వేలపౌనులతో పని ప్రారంభింపబడెను ఈపనిని కోలారు బంగారు గనులలో పనిచేయు జాన్ టెయిలర్ కంపెనీవారి పరము చేయబడెను ఇటీవల మరి౨౦వేలపౌనులు ప్రభుత్వమువారీపనికై యిచ్చినారు ౩౦మే ౧౯౪౦నాడు మహిమాన్విత నిజాంగారు ఫర్మానుద్వారా గనులను త్రవ్వుటకై ౨లక్షల ౫౦వేల పౌనుల అంగీకారమిచ్చినారు ఇంతలో రాయచూరులోని హట్టిఅను స్థలములో త్రవ్వబడు గనులు హిందూస్థానములో ప్రఖ్యాతివహించిన బంగారుగనులలో గణ్యతపొందునని ఆశింపబడుచున్నది

## గాంధిమహాత్మునివద్ద సంస్థానాల వ్యవహారాలు

మైసూరు కాంగ్రెసు నాయకుడగు శ్రీరామలింగాచార్యగారు మైసూరు రాజకీయాలనుగూర్చియు మైసూరులో హరిజనోద్యమమునుగూర్చియు జూను ౧౭వతేది సేవాగ్రామములో మహాత్ముని కలుసుకొనిరి

భోపాలుసంస్థాన రాజకీయస్థితిని మహాత్మునికిని స్వరాజ్యగారికిని నివేదించుటకై ఆసంస్థాన ప్రజామండలి ప్రతినిధులుకొందరు జూనుగ౧౫తేది వెళ్లిరి

## భారతీయ సంస్థానాల మంత్రులసభ

బొంబాయినగరంలో భారతీయ సంస్థానాల మంత్రులసభ జూను౧౭వతేది సమావేశమై సంస్థానాలలో నల్లమందు పండించుటనుగూర్చియు ఆదాయపన్ను నుగూర్చియు ఆలోచించెను

రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరిగారు సతీవియోగ ఖిన్నులై రాజాలకపోవుటవల్లను, బరోడాదివానుకు అస్వస్థతగా ఉన్నందువల్లను సభవారు తమఅధ్యక్షుని ఎన్నుకొనిరి

# సంపూర్ణ దేశస్వాతంత్ర్యము కోరనివారితో సమాధానములేదు

## కాంగ్రెసు ముస్లింలీగుతో సమాధానపడుటకుఆటంకము

"హరిజన్" పత్రికలో గాంధిమహాత్ముని వ్యాసము

భారతదేశములో నేడు రెండేపక్షములున్నవి ఏఒక్కటిగాని తన లక్ష్యమును సడలింపనదపడినవేగాని రెంటికిని సమాధానముకుదరజాలదు. అట్టి సమాధానము చేకూరి సమిష్టిప్రయోజనము సాధింపవలెనను సంకల్పముతో, కాంగ్రెసుభవిష్యత్తును విస్మరించి, విశ్వాసమును గోల్పోయినచో అదదాని శక్తినంతయు గోల్పోయినదన్నమాటయే-అనిమహాత్ముడు. "రెండుపక్షములు" అను శీర్షికక్రింద 'హరిజన'పత్రికలో వ్యాసములో నిట్లువ్రాసినాడు

బహిరంగముగను రహస్యముగను భారతదేశములో సమిష్టిసామరస్యము చేకూర్చుటకు సర్వపక్ష సమావేశము నేర్పరుపుమని నాకు విన్నపములు కుప్పలు తెప్పలుగ వచ్చుచున్నవి. ఇప్పుడు గ్రేటుబ్రిటనునుండి మనము రాబట్టగలుగునది రాబట్టవచ్చునని వారివాదము. కాని అసన్నిశ్రుతులొక ప్రధానాంశమును మరచుచున్నారు. భారతదేశపక్షమున కాంగ్రెసుఅవిచ్ఛిన్నమైన స్వాతంత్ర్యమునువాంఛించుచున్నది. అట్టికాంగ్రెసుతనతో ఏకీభవించనివారితో సమిష్టినిర్ణయమును గావించుకొనజాలదు. తనలక్ష్యమునకు వ్యతిరేకముగ నది వర్తించినచో దానియందుంచిన విశ్వాసమునకు ద్రోహమొనరించుటయేయగును. అందుచేతని సమిష్టిప్రయోజనము, సంకల్పము ఉన్ననేతప్ప అఖిలపక్షసభ ఎంతమాత్రము జరుగజాలదు. భారతదేశములో ఏఒకపక్షముగాని స్వాతంత్ర్యమును గైకొనుటకు తగినంత బలముగలిగియున్నచో, మీరు దానిని స్వీకరించుటకు సమిష్టిసంకల్పముతో అరుదెంచుడు- అని బ్రిటనుఅనజాలదు. కాంగ్రెసువకునిజముగ అట్టిబలములేదని ఒప్పుకొనవలెను. ప్రతిఘటనల నెదుర్కొనుమను, నేడుకాంగ్రెసు ఇట్టిస్థితికి రాగలిగినది. తనశక్తిని కాంగ్రెసుతగ్గించుకొనక, తగినఓర్పుతోనున్నచో స్వాతంత్ర్యమును స్వీకరించుటకు తగినబలము చేకూర్చుకొనగలుగును. మనము ముందు అడుగువేయగలుగుటకుముందు అన్నిపక్షములతో సమిష్టిసంకల్పమునకు రావలెనను మిథ్యాభావములో మనము మునిగి తేలుచున్నాము

ప్రజాస్వామ్యపద్ధతులపై ఎన్నుకొనబడినసంస్థ ఒక్కటేగలదు- అదికాంగ్రెసు-మిగిలినవన్నియుగూడా స్వయం నియుక్తములు, లేక అయా శాఖలలో వారిచేమాత్రమే ఎన్నుకొనబడినవి కాంగ్రెసువలెనే ముస్లింలీగు కూడా ప్రజలచే ఎన్నుకొనబడి నిర్మింపబడినసంస్థయే. కాని అది పరిపూర్ణముగా మతసాంఘికసంస్థ- అది భారత దేశమును రెండుగ విభజింప గోరుచున్నది- హిందువులను, ముస్లింలను వేర్వేరుభాగములనని కోరుచున్నది- ముస్లింలతో సమాధానపడి వారిసహాయముపై బ్రిటను ఆధారపడవలెనని ఒకముస్లింలీగుసభ్యుడనుచున్నాడు- అదిఒకవిధముగ సమస్యను పరిష్కరించుటయేగాని, అది బ్రిటిషు, ప్రభుత్వమునుశాశ్వతముగ నిచట స్థాపించుటయేయగును. అట్లేతరి హిందూమహాసభయు తమయెడను హిందూసంస్థానములయెడను సాదర గౌరవదృష్టులబరుపుమనును-అటుల నేడు రెండుపక్షములున్నవి కాంగ్రెసునుబలపరచు అనుచరులును, బలపరచని పక్షములు- ఏఒకపక్షముగాని తన ప్రయోజనమును సడలింపక సమిష్టి సంకల్పమునకు నిర్ణయమునకురాజాలదు-కాంగ్రెసు తనహక్కులకై నిశ్చలముగ నెలుబున్నదో ఇతర పక్షములును తమతమహక్కులకై అటులనే నిలచుచున్నారు- అరీతిగ ప్రతిష్టంభన మేర్పడుచున్నది- ఇది బాహ్యలక్షణము మాత్రముగ నేయున్నది- సమిష్టివాంఛనటుంచి, కాంగ్రెసుతనవాంఛ వెల్లడించుటకు వెనుదీయరాదు- అటులెప్పుడును వెనుదీయలేదు- ప్రతికక్షులుచెప్పునటుల కాంగ్రెసు అహింసాపద్ధతి దానిని దూరముగనుండనుండ జేయుచున్నది-అందుచేతనే పెద్దఎత్తువ గుట్టము నెక్కకుండ జేయుచున్నది- కాంగ్రెసు అన్నిపక్షములతోను మంచిచేసుకొనవలెను- అనుమానములతొలగింపవలెను-తనయథార్థ ప్రాతినిధ్యమునందు విశ్వాసముకలిగింపవలెను- తనగృహమును మొదట చక్కబరచుకొనినపుడే కాంగ్రెసు ఇదిసాధింపగలదు- ఇందులకు కొంతకాలముపట్టవచ్చును-అందుకు తగినకాలము నీయవలెను- అది ఎప్పటికిని వృథాగాదు- సమిష్టిసంకల్పమును సాధించి సామరస్యమును నెలకొల్పుటకు భవిష్యత్తును విస్మరించి, విశ్వాసమును నమ్మకమునుగోల్పోయి తన ప్రయోజనమును సడలించినచో, అది తనశక్తినిగోల్పోగలదు- నేడు కాంగ్రెసుపై భారతదేశపుఆశలున్నవి. కాంగ్రెసు మైనారిటీలో నున్నను మెజారిటీలోనున్నను తనవెనుకటి పట్టుదలను, నియమనిష్ఠను యెంతమాత్రము వదలకుండుట శ్రేయముగును

---

సంవత్సరము చందా
౬ పాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సంవత్సరం చందా
౫-౮-౦ కల్దారు.
పాత పత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

**Volume 15** **Hyderabad-Dn.** **Thursday 20 June 1940** **Number 14**

## ఏకాకి బ్రిటను

జూను ౧౮వ తేదినాడు బ్రిటను ప్రధాని విన్స్టన్ చర్చిల్ గారు బ్రాడుకాస్టు చేయుచు నిట్లు చెప్పిరి:

"ఫ్రాన్సునుండి వచ్చిన వార్త చాలా చెడ్డది. ధీరయోధులైన ఫ్రెంచిజనులు ఈ ఘోర మరదృష్టములో పడినందులకై నేను వగచుచున్నాను. వారలయెడ మనకున్న భావాలను గాని, ఫ్రాన్సు యొక్క సహజప్రతిభ మరలపైకి రాగలదని మనకున్న విశ్వాసమును గాని ఏదియు మార్పజాలదు.

ఫ్రాన్సుకు సంభవించిన స్థితివలన బ్రిటను విశ్వాసమున్ను, లక్ష్యమున్ను మారవు. ప్రపంచ క్షేమము నురక్షించుటకు ఆయుధధారులముగ మన మొకరమే ఇప్పుడింకను నిలబడియున్నాము. ఈ గొప్ప గౌరవమునకు అర్హులముగ నుండుటకు మనచేతనైన దంతయు మనము చేసెదము.

మన దీవి నిరక్షించెదము. మరియు మన సామ్రాజ్యముతో మనము ఆజేయులమై మానవుల నొసటినుండి హిట్లరు పాపముతొలగించబడు వరకు పోరాడగలము. అంతమున అంతయు క్షేమముకాగలదని మన దృఢ విశ్వాసము."

హిట్లరు ఇంగ్లాండుపైకి ఈ జూను లోనో జులైలోనో వచ్చునేగాని ఆగస్టు, సెప్టంబరులలో రాడనుచు, పూర్వము జర్మనీలో బ్రిటను రాయబారిగనుండిన సర్ నెవిల్ హెండర్సన్ గారు లింకనులో జూను ౧౮వ తేదిన ఉపన్యసించిరి. ఇట్టి ప్రతివాడును సైనికశాస్త్రీయ సంపూర్ణముగ సిద్ధమగుట ఆవసరమనిరి. శరీరపాటవముగల ప్రతిబాలునికిని రైఫిలు నెట్లు ప్రయోగించవలెనో తెలిసియుండవలెననిరి. "హెర్ హిట్లరు బ్రిటిషువారిని ఓడించిననేగాని ఈ యుద్ధములో గెలువజాలడు. మనచుట్టును ముట్టడిలేసి మనకు ఆహారపదార్థములను చేరకుండ చేసియో, మనపై బాంబులువేసి లొంగదీసియో, మనదేశముపై సేనలను దండెత్తబంపియో మనలను ఓడించును. ఈ అన్ని మార్గములను కూడ అతడు అవలంబించగలడని నాయభిప్రాయము".

### హిట్లరుగారి ఉద్దేశ్యమేమి?

ఇంతకును హిట్లరుయొక్క ఉద్దేశ్యము ప్రపంచాధిపత్యమా అను ప్రశ్న అనేకులకు అనుమానము కలిగించుచునేయున్నది. జూను ౧౫వ తేదిన అమెరికా దేశపు పత్రికాప్రతినిధియొకడు (పేరు కారల్ వాన్ వీగాండ్) హిట్లరును దర్శించగా హిట్లరు తన ఆశయములను తెలిపెను. అమెరికా ఖండము అమెరికా దనియు, ఐరోపాఖండము ఐరోపా వారిదనియు తన వ్యవహారముల సూత్రమనియు, అమెరికాఖండ వ్యవహారములలో తాను జోక్యము కలిగించుకొన యత్నించుచుండెనను ఆరోపణ నిరాధారమనియు, అమెరికావారు తమరక్షణార్థము ఎన్ని ఏర్పాట్లు చేసికొన్నను తనకేమియు హాని తోప్రమేయములేదనియు, కాని మిత్రమండలిరాజ్యాలకు వారలెంత సహాయమిచ్చినను యుద్ధపు పర్యవసానము మారదనియు హిట్లరు చెప్పెను.

విదేశములలో కుట్రలు జరుపుచున్న నాజీ వ్యక్తులుగాని సంస్థలుగాని లేవనియు, కొన్ని దేశములలో ప్రభుత్వపక్షములకు ప్రతికూలముగనున్న వారిని అణచివేయుటకై ఆయా ప్రభుత్వములు ఇదియొకసాకుగ చెప్పుచున్నవనియు అనిరి.

"ఐరోపా సంగ్రామానికి పూర్వము జర్మనీకున్న కాలనీలన్నియు మరల జర్మనీకి చేరవలెనని నేను కోరుచున్నాను. అంతేగాని బ్రిటిషుసామ్రాజ్యమును ధ్వంసమొనర్చుట నా ఉద్దేశ్యమని నేనెన్నడును చెప్పియుండలేదు. కాని ప్రస్తుతము ఈ సామ్రాజ్యవిచ్ఛేదమునకు బారితీయుచున్నవారి అధికారమును అంతమొందించెదను. బ్రిటిషుసామ్రాజ్యమును పాలించుచున్న ధనికవర్గమును నాశనమొనర్చెదను. సముద్రముపై బ్రిటనునకుగల అధికారము అంతమొందవలెను.

తుదకు హిట్లరు ఇట్లు చెప్పెను, "నేను శాంతినే కోరుచున్నాను. కాని కేవలము ఒడంబడికలవల్ల శాంతికుదురదు. ప్రపంచమునందలి వివిధజాతులకును వివేకము కలుగవలెను. పెద్దజాతుల అవసరములను అందరును గుర్తెరుగవలెను"

### బ్రిటను జవాబు

దీనిపై బ్రిటను ప్రచురణశాఖమంత్రికి కార్యదర్శి హెరాల్డు నికల్సన్ గారు జూను ౧౫వ తేది బ్రాడ్ కాస్టుద్వారా విమర్శచేయుచు, హిట్లరు కోరుచున్న విధమున సముద్రమార్గముల స్వాతంత్ర్యము సమకూరవలెననిన, బ్రిటను నౌకాబలము జర్మనీవశము కావలసియుండుననియు. బ్రిటిషువారు నౌకాబలమును కోల్పోయినచో, వారు కూడ జెకోస్లావాకియావలెనే జర్మనీకి లొంగిపోవలసియుండుననియు చెప్పిరి.

### అమెరికాకు జర్మను ప్రతినిధి బెదిరింపు

అమెరికాలో న్యూ ఆర్లియన్సులో జర్మనీ ప్రతినిధియగు బారన్ యడ్గార్ వాన్ సీజల్ గారు అమెరికా మిత్రమండలికి ఆయుధాది యుద్ధావసరములను పంపుచున్నందుకు బెదరింపుగా జూను ౧౮ వ తేది ఇట్లు పలికెను:

"మా దేశము చావుబ్రతుకుల పోరాటములో నుండగా మా శత్రువులకు సకలసహాయము అమెరికా చేసినను మాటను మా దేశ మెన్నటికిని మరువజాలదు, జర్మనీ త్వరలో గెలువగలదు. జర్మనీకి యూరోపా వెలుపలరాజ్యాక్రమణ కాంక్ష లేదు. ఆఫ్రికాలోనుండిన తమభూభాగములును, బహుశా మరికొంచమున్ను మాత్రమే జర్మనీకోరును."

### ఐర్లాండులో

### భిన్నపక్షముల ఐక్యము

బ్రిటనుపై జర్మనీ దండెత్తుచో ఐర్లాండును ఆపాయము కలుగునను భయముతో ఐర్లాండులో యుద్ధసంసిద్ధులగుచున్నారు. ఈ యుద్ధభయము యొరుట ఐర్లాండులోని భిన్న రాజకీయపక్షములు ఏకమైనవి. ఐర్లాండు నాయకులగు డి వెలరా, కాస్గ్రేవు, గ్రిఫిత్ గార్లు జూను ౧౭వ తేది వ

## సోవియట్ సేనల క్రొత్తఆక్రమణాలు

### బాల్టికు రాజ్యాల ప్రభుత్వము మారుట

జూను ౧౫వ, ౧౬వ, ౧౭వ తేదులలో వచ్చినకొన్ని వార్తలు రష్యాసేనల క్రొత్తఆక్రమణలను గూర్చినవి. ఈ క్రొత్త ఆక్రమణాలు మొదట బెదరింపులలో, లిథుయేనియాతో ప్రారంభమైనవి. తుదకు ఈ బెదరింపులు రష్యాతో ఒడంబడికచేసికొనియుండిన బాల్టిక్ రాజ్యాలన్నిటికిని విస్తరించబడెను. ఆ రాజ్యాలన్నియు లొంగినవి.

ఇటీవల కొద్దిరోజులక్రింద లిథుయేనియాలో రష్యావారు ఒడంబడిక ప్రకారము ఉంచిన సేనలలో కొందరిని ఎవరో అపహరించిరను ఆరోపణను రష్యావారు చేసినతర్వాత లిథుయేనియా ప్రభుత్వమువారు ముందుజాగ్రత్తగా కట్టుదిట్టాలుచేయుచున్నట్లు వార్తవచ్చెను ఇంతలోనే ఇప్పుడు రష్యా ప్రధాననగరమగు మాస్కోలోని రేడియోనుండి జూను ౧౬వ తేదిగావించిన ప్రకటనలో లిథుయేనియా ప్రభుత్వములోని న్యాయశాఖమంత్రి స్కుకాస్ గారు ఈ అత్యాచారమునకు కారకుడని ఆరోపణచేయబడినది. ఆమంత్రిని తొలగించి శిక్షించవలెననియు, ప్రస్తుతమున్న మంత్రివర్గముకే మార్చి రష్యాలిథుయేనియాల ఒడంబడికను ఇష్టముతో అమలుపరచుచు లిథుయేనియాలో రష్యాపై ప్రతికూల ప్రచారమును మాన్పించు మంత్రివర్గము నేర్పాటుచేయవలెననియు, లిథుయేనియాలోని రష్యాసేనలను ఇకముందు దౌర్జన్యమునుండి రక్షించుటకై మరికొన్ని రష్యాసేనలను లిథుయేనియాలోని వేర్వేరుస్థలాలలో నిలుపదలచితిమనియు రష్యాప్రభుత్వము లిథుయేనియా ప్రభుత్వమునకు అంత్యసందేశమునొకదానిని పంపెను. లిథుయేనియాప్రభుత్వము దీనికి అంగీకరించెను.

జూను ౧౬వ తేది లిథుయేనియాలో మంత్రివర్గము రాజీనామానొసగెను. జనరల్ రాస్టికస్ గారి అధ్యక్షతన నూతనమంత్రివర్గమేర్పాటు చేయదలచగా రష్యావారు ఒప్పుకోలేదు. అందుపై జూను ౧౭వ తేదినాటికి లిథుయేనియా అధ్యక్షుడు దేశంవదలి పారిపోయెను. ఈయన జూను ౧౭వ తేదిరాత్రి జర్మనీసరిహద్దులు దాటినపుడు అక్కడ ఖైదుచేయబడెను. మెర్కిస్ గారు అక్టింగుప్రధానిగా పనిస్వీకరించి రష్యాసేన లిథుయేనియా ప్రజలశాంతి రక్షణకు అవసరమేనని తమదేశీయులకొక ప్రకటనచేసిరి. జూను ౧౫వ తేది మధ్యాహ్నమే రష్యాసేనలు లిథుయేనియాలోకి మూడుచోట్లనుండి ప్రవేశించెను.

### ఎస్టోనియా

రష్యా ఇట్లే ఎస్టోనియాకుకూడ అంత్యసందేశమిచ్చెను. ఇదికూడ అంగీకృతమై ఎస్టోనియా ప్రధానమంత్రివర్గము రాజీనామానిచ్చెను. ఎస్టోనియాలోకూడ రష్యాసేన ఎక్కువచేయబడును.

### లట్వియా

లట్వియాకుకూడ రష్యా ఇట్టి అంత్యసందేశమిచ్చెను. లట్వియా ప్రభుత్వము దానిని అంగీకరించెను. మంత్రివర్గము మారెను. క్రొత్తరష్యాసేనలు లట్వియాలోకి జూను ౧౭వ తేది ఉదయమునుండి ప్రవేశించెను. రష్యాయుద్ధనౌకలు లట్వియాలోకి వచ్చెను.

### జపానుయుద్ధము

జపానుసేనలు చైనాలో జూను ౧౬వ తేది యీచాంగ్ నగరమును చైనావారి ఇచాంగ్ రేవును ఆక్రమించెను. జపానువిమానాలు జూను ౧౬వ తేదీ చుంకింగు నగరముపై బాంబులువేసెను. చీనావారిలో ౫౦౦మంది చనిపోయినట్టిట్లు తెలియవచ్చెను.

జైను నగరములో (జపాను?) ప్రభుత్వ ... ఉపన్యసించుచు "ఇప్పుడు ఐర్లాండు స్వాతంత్ర్యం కాపాడుటకై ఒక్క పార్టీ ... ఆగునని ..." చెప్పిరి.

### ఈస్టిండీస్ దీవులు

హాలెండువారి కాలనీలగు ఈస్టిండీస్ దీవులలో పార్లమెంటువారు గవర్నరుకు సర్వాధికారమొసగిరి.

### ఆస్ట్రేలియా

ఇంగ్లాండులోవలెనే సర్వజనులపైనను, ఆస్తులపైనను ప్రభుత్వమునకు సర్వాధికారనిచ్చు శాసనము ఆస్ట్రేలియాలో చేయబడునని ఆదేశపు ప్రధాని మెంజిస్ గారు రేడియోలో ప్రకటించిరి.

## ఇటలీ యుద్ధము

ఇక మిత్రమండలితో ఇటలీయుద్ధము మాత్రము. జూను ౧౫ వ తేదినాడు ఇటలీసేనలు ఇటలీసరిహద్దులనుదాటి ఆల్ప్సుకొండల ప్రాంతమున ఫ్రాన్సుకుచేరిన కొంతప్రదేశమును వశపరచుకొనెను. ఫ్రెంచిసేనల ప్రతిఘటన వ్యర్థమయ్యెను.

జూను ౧౪ వ తేదిన బ్రిటిషుసైనికులు ఈజిప్టు లిబియాల సరిహద్దువద్దనున్న ఇటలీవారి కాపోజకోటను, మెడలీనాకోటను పట్టుకొనగలిగిరి.

ఆక్రమణవార్తలు ఇంతే. తక్కినవన్నియు నౌకావిఘాతములకును, విమానాలదాడులకును సంబంధించినవార్తలు. ఈ దాడులన్నిటిలో కొద్దికొద్ది నష్టాలుకలిగెను.

### విమానాలదాడులు

జూను ౧౫ వ తేదినాడు ఇటలీవిమానాలు, యుద్ధనావలు జినోవాపైదాడితీసి కొంతనష్టము కలిగించెను. నాజీరు విమానాశ్రయముపైకిపోయి ఇటలీవిమానాలు బాంబులువేసెను. మాల్టాపై జూను ౧౫, ౧౬వ తేదులలోకూడ బాంబులువేసెను. ఈజిప్టు లిబియా సరిహద్దులవద్ద సోలం నగరముపైనను, ఈజిప్టులో సెడిబరాని నగరముపైనను, అలెగ్జాండ్రియా నగరముపైనను జూను ౧౬వ తేది ఇటలీవిమానాలు బాంబులువేసెను.

ఇక బ్రిటిషువిమానాలు హైర్ బాబు ప్రాంతంలోని ఇటలీసైనిక కేంద్రాలపై జూను ౧౪వ తేదినాడును, కిస్మాయి విమానాశ్రయముపై జూను ౧౫వ తేదినాడును, అబిసీనియాలోని డిరెడావా విమానాశ్రయంపైనను లిబియా సరిహద్దులలోని ఇల్వాక్ నగరంపైనను జూను ౧౬వ తేదినాడును బాంబులనువేసెను. దక్షిణఆఫ్రికా ప్రభుత్వపు విమానాలు అబిసీనియాలోని నగరాలపై జూను ౧౫వ తేది ఎన్నో బాంబులు వేసెను.

## ఎగర్టన్ గారి మరణము

హైదరాబాదు(దక్కన్), అమర్దాదు ౧౩ మ.ఘ.వ. నిజాం ప్రభువుగారికి బాల్యములో ఉపాధ్యాయులుగానుండిన సర్ బ్రయన్ ఎగర్టన్ అనువారు ఇటీవల ఇంగ్లాండులో చనిపోయినారు. వారు కొంతకాలము పాయిగాలకు సదరుల్ మొహాంగా పనిచేసియుండిరి. అందుచేత వారి జ్ఞాపకార్థము పాయిగా కచ్చేరీలు ఒక దినము మూసివేయబడెను.

### ఇటలీసబ్ మెరైనుల నష్టము

ఇటలీతో యుద్ధం ప్రారంభమైనపిమ్మట మిత్రమండలివారు అధమపక్షము నాలుగు ఇటలీసబ్ మెరైనులను సముద్రములో ముంచివేసినట్లు బ్రిటిషువారు జూను ౧౬వ తేది ప్రకటించినారు. టునిసి ప్రాంతంలో ఫ్రెంచివారిచే ఒక ఇటలీ నావ ముంచబడెను.

### బ్రిటిషు నౌకలనష్టము

జూను ౧౫వ తేది ఉదయం మధ్యధరాసముద్రంలో ఇటలీనావలకును మిత్రమండలినావలకును జరిగినయుద్ధంలో ఒక బ్రిటిషు డిస్ట్రాయరు, ఒక సబ్మెరైను, ఒక క్రూయిజరు ఇటలీవారినౌకలచే ముంచివేయబడెను.

### బ్రిటిషువారి కరపత్రప్రచారము

జూను ౧౫వ తేది బ్రిటిషువిమానాలనుండి ఇటలీనగరములలో చల్లబడిన కరపత్రాలలో ఇటలీకి జయంకలిగినా, అపజయంకలిగినా ఇటలీ ప్రజలు దారిద్ర్యము, దాస్యము అనుభవించవలసియుండునని వ్రాయబడియుండెను.

### మిత్రమండలికి సహాయాలు

ఫ్రాన్సుసేనలతోచేరి ఇటలీతో పోరుటకై రగుసు ఆబిసీనియాజాతి నాయకులు జూను ౧౬వ తేది జిబౌటికి చేరిరి. ఇటలీసేనలు లిబియాను ఆక్రమించినపుడు ఆచటనుండి తరిమివేయబడిన ఇరువురు అరబ్బునాయకులు తమ అనుచరులతో జూను ౧౬వ తేది ఈజిప్టు ముఖ్యపట్టణమగు కైరోకువచ్చి ప్రధానమంత్రినిదర్శించి తాము ఈజిప్టుకు సహాయము చేసెదమనిరి. గ్రాండుమఫ్తీగారును, సిరియాయందలి మహమ్మదీయ యువక సంఘమున్ను ఇటలీచర్యను ఖండించెను.

### తుర్కీస్థైఖరి

యూరపు ఆగ్నేయ భాగంలోను, సమీపప్రాచ్యంలోను యుద్ధవార్తలు లేకుండా సాధ్యమైనంత సహాయాన్నిచేసి బ్రిటను ఫ్రాన్సులతో తానుగావించుకొన్న ఒడంబడికను పాలించుటకు మార్గమేమిటాయని తుర్కీవారు ఆలోచించుచున్నట్లు "సండేటైమ్సు" అను లండనుపత్రిక యొక్క రాజకీయవిలేఖరి చెప్పుచున్నారు.





Printed and Published by. G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn. Editor- S. Prathapa Reddy B. A. B. L.